23.8.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:34 విడిప్రతి రూ.2.00లు Phone: 27354 Regd. No. HNL 18


# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి




ఇటు ముఖ్యమంత్రి మెప్పు పొందలేక, అటు జనంలోకి వెళ్లలేక...

## ఎమ్మెల్యేలు నీరసపడిపోయారు!

తెలుగుదేశం ప్రభుత్వం, పార్టీ కూడా తీవ్రమైన రాజకీయ సంక్షోభంలో చిక్కుక పోతున్నాయి. మెజారిటీకి మించిన ఎమ్మెల్యేల సంఖ్యతో; అసమ్మతులు, తిరుగుబాట్లు లేని క్రమశిక్షణతో; ఎదిరించే వాడే లేని ఏక నాయకత్వంతో; జవసత్వాలు లేని ప్రతిపక్షం బలహీనతతో ఎంతో దృఢంగా, బలీయంగా కన్పిస్తున్న చంద్ర బాబు సర్కారు లోలోపల బలహీనమై పోతూ వుంది! ఆర్థిక పరంగా చంద్ర బాబు తీసుకొంటున్న నిర్ణయాలే దీనికి కారణం కావడం విశేషం.

రాష్ట్రంలో – మరీ ప్రధానంగా కోస్తా జిల్లాలలో ప్రబలుతున్న రైతు నిరసనోద్యమం తెలుగు దేశం పార్టీ నవనాడులనూ కృంగ దీస్తున్నది. నిజానికి ఉద్యమం ఇప్పటికీ వ్యవస్థీకృతం కాలేదు. ఎక్కడి కక్కడ రైతులు కూడి, తమ నిరసనను తెలియ జేయడం తప్ప, ఒక నిర్దిష్ట కార్యక్రమంతో, నాయకత్వంతో నడవడం లేదు. అందుకింకా సమయం పట్టేట్లున్నది. కాని ఉద్యమ పొగనే ప్రభుత్వం భరించ లేకున్నది. అది కార్చిచ్చు వలె వ్యాపించి నప్పుడు ఆ మంటల సెగను తట్టుకోవడం వారి కలివయ్యేట్లు లేదు.

కోస్తా జిల్లాల్లోని ఏ గ్రామానికి చుట్టపు చూపుగా వెళ్లి రావడానికి కూడా తెలుగు నాయకులు భయపడి పోతున్నారు. ఏలూరులో మంత్రి విద్యాధర రావును, బందరులో మంత్రి సింహాద్రి సత్య నారాయణను రైతులు పైన పగి గొట్టినంత పనిచేసిన తర్వాత ఎమ్మెల్యేలు గ్రామాలకు వెళ్లడానికి జంకుతున్నారు.

ఒక్క రైతులే కాదు – సమాజంలోని అన్ని వర్గాల ప్రజలకూ చంద్ర బాబు ప్రభుత్వం దూరమై పోవడం ఎమ్మెల్యేలను కలవర పరుస్తున్నది. విద్యుత్ చార్జీలు, నీటితీరువా ధరలను తగ్గించ కుంటే రైతు అనేవాడు ఎవరూ తెలుగు దేశం పార్టీ పేరు పలకడన్నది స్పష్టమై పోయింది. సబ్సిడీ బియ్యం ధర పెంపు వల్ల సన్నజనం పార్టీకి దూరమై పోతున్నారు. మద్య నిషేధం అమలు సైతం వారిని సంతృప్తి పరచ లేక పోతున్నది. దీనికి తోడు కాలేజి ఫీజులను నాలుగింతలు పెంచడానికి నిర్ణయించారు ముఖ్యమంత్రి. అదే జరిగితే విద్యార్థులలో నిరసన పెల్లుబకడం ఖాయం. అప్పుడు తెలుగు నాయకుడన్న వాడు ఎవడూ పట్టణాల లోనూ తిరగ లేడు.

అన్ని ధరలు పెంచి నప్పుడు అభివృద్ధి కార్యక్రమాల అమలులోనైనా చొరవ చూపిస్తున్నారా అంటే అదీ లేదు. గ్రామాలలో గృహ నిర్మాణం, రోడ్ల నిర్మాణం, బావులు, చెరువుల త్రవ్వకం వంటి పనులేవీ జరగడం లేదు. శ్రమదానం పేరుతో, ప్రజల వద్దకు పాలన పేరుతో ఇంత కాలం భ్రమలో పెడుతూ వచ్చారు. కాని అప్పుడదీ లేదు. నిర్మాణాత్మకమైన కార్యక్రమం లేకుండా, వట్టొట్టి మాటలతో జనాన్ని ఎంత కాలం మాయచేయ గలమన్నది ఎమ్మెల్యేల ప్రశ్న. ఇదే పరిస్థితి కొనసాగితే తాము నియోజక వర్గాల మాట మరిచిపోయి హైదరాబాదులోనే వుండి పోవలసి వస్తుందని వారు భయపడు తున్నారు. సగం మంది తెలంగాణా ఎమ్మెల్యేలు ఇప్పుడదే పని చేస్తున్నారు.

ఇంకొక ప్రక్క హైదరాబాదులో వుండి గోళ్లు గిల్లుకోవడం తప్ప చేసేదేమీ లేదన్నది మరొక నిస్పృహ. మంత్రి వర్గ విస్తరణను, కార్పొరేషన్ ఛైర్మన్ పదవుల పంపకాన్ని ముఖ్యమంత్రి నిరవధికంగా వాయిదా వేసుకొంటూ వెళ్లడం ఎమ్మెల్యేలలో ఆగ్రహం తెప్పిస్తున్నది. పార్లమెంట్ ఎన్నికలు గడిచిపోయిన తర్వాత

కొరవ 8 పేజీలో






రైతు ఉద్యమ ప్రారంభ సూచకంగా ముత్తుకూరు, పొదలకూరులలో జరిగిన సభలలో – ఆనం రామనారాయణ రెడ్డి, కెవి సుబ్బారెడ్డి, సివి శేషారెడ్డి, ఆనం వివేకానంద రెడ్డి, కాకాణి రమణా రెడ్డి, వేమారెడ్డి శ్యామసుందర రెడ్డి, మెట్టా చంద్రశేఖర్ రెడ్డి, చేవూరు దేవకుమార్ రెడ్డి తదితరులు.

నెల్లూరులోనూ రాజుకొంటున్న రైతు ఉద్యమం

## కదిలిస్తే కంట నీరు-పిలిస్తే కదను తొక్కే తీరు!

పెంచిన విద్యుత్ ఛార్జీలు, నీటి తీరువాలకు వ్యతిరేకంగా జిల్లాలోని కాంగ్రెస్ నాయకులు ఇచ్చిన పిలుపుకు రైతుల నుంచి మంచి స్పందనే వచ్చింది. జిల్లా కాంగ్రెస్‌కు, ఈ పిలుపుకు సంబంధం లేదని డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవరెడ్డి పుల్లవిరుపు ప్రకటన చేసినా పిలిచిన కాంగ్రెస్ వాదులు, పిలిచిన రైతులు లెక్క చేయకుండా వీధుల్లోకి వచ్చేశారు. ముత్తుకూరు, పొదలకూరులలో జరిగిన రెండు సభలూ విజయ వంతమైనాయి. రైతులు తమంతట తాముగా తమ పేరుతో పెట్టి ఏ సభకైనా రావాలని ఉత్సాహ పడడమే దీనికి కారణం.

డిసిసి అధ్యక్షుడు తన రాజముద్ర వేయడానికి నిరాకరించిన తర్వాత ఈ ఉద్యమం నడిపించడానికి ఆనం రామనారాయణ రెడ్డి, సివి శేషారెడ్డి, కె.వి.సుబ్బారెడ్డి, మునిసిపల్ ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానందరెడ్డిలతో పోరాటం గ్రూపు ఏర్పడింది. రాష్ట్ర స్థాయి పోరాట కమిటీతో నెల్లూరు సంస్థను అనుసంధించ డానికి ప్రయత్నిస్తున్నారు. పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరులోనూ ఇదే ప్రకారం కాంగ్రెస్ కలిసి వచ్చినా, రాకున్నా పోరాటం జరపడానికి రైతులు సిద్ధపడు తున్నారు. ఉద్యమం అక్కడే ఉధృతంగా వుంది. తెలుగుదేశం అభిమానులైన రైతులు బ్రతుకు తెరువు కోల్పోవలసిన ఈ తరుణంలో పార్టీ సంకెళ్లు తగిలించు కోవడం ప్రాణాంతకమని భావించి ఉద్యమ ప్రవాహంలో కలిసి పోతున్నారు.

రైతు పరిస్థితి అంత దయనీయంగా తయారై వుంది. ఈ రేట్ల పెంపకం వల్ల కదిలిస్తే కంటనీరు జలజల రాలే దుస్థితి వుండబట్టే వారు పిలిస్తే కదన కుతూహలురై ముందుకు వస్తున్నారు. రెండు పంటలకు నీటి తీరువా, పెంచిన రేటు ప్రకారం విద్యుత్ బిల్లు చెల్లిస్తే వరి సేద్యం మానేయవచ్చు.

> గదిలో పెట్టి
> కొట్టబోతే
> తెగబడే పిల్లి
> చందంగా వుంది
> రైతు పరిస్థితి!

ఎకరాకి ఏడాదికి రూ.1500ల నుంచి రెండు వేల వరకు అదనపు భారం పడుతున్నది. కానీ వడ్ల ధరలో పెంపు లేదు. ఇంకొక ప్రక్క ఎరువుల ధరలు, డీసల్ ఖర్చు, కూలీ రేట్లు, మందు మాకుల ధరలూ పెరిగి పోయాయి. వీటన్నింటితో రైతు – అది ఐదెకరా సన్నరైతు కాని, పాతికెకరాల పెద్దరైతు కాని – బ్రతకడం దుర్లభం.

సాధారణంగా రైతు మూగజీవి. మౌనంగా బరువు భరించడం తప్ప ప్రతిఘటించి ఎరుగడు. కాని ఇప్పుడు వీధిలోకి వస్తున్నాడంటే – అతని పరిస్థితి గదిలో బంధించిన పిల్లి చందం కావడమే. తెగబడి తిరగబడ కుంటే బ్రతుకే వుండదనే భయమే రైతు నిరసనోద్యమానికి ప్రేరేపిస్తున్న పీక నులిమేందుకు జరుగు తున్న ప్రయత్నాన్ని ఇప్పుడు నివారించ కుంటే – రేపు ఆ పీకే వుండదన్న వివేకం రైతులో కలుగుతున్నది.

నెల్లూరు జిల్లాలో ఉద్యమాన్ని ఏ రూపంలో నడిపించాలనే విషయంలో ఇంకా ఒక నిర్ధారణకు రాలేదు. మరొక వారం రోజులలో ఉద్యమ స్వరూప స్వభావాలు ఏర్పడవచ్చు.

* * *

18 తే

సభకు

60

# ఉరితీయాలి !

ఆకలి కడుపు నింపుకోను ఒక పేద పిల్లవాడు ఎవరి పర్సులో నుంచో పది రూపాయలు తస్కరిస్తే – వాడికి పిక్ పాకెటర్ అని పేరు పెట్టి, పది మంది తలా ఒక తన్ను తంతారు; ఒక దొంగ ఎవరింట్లోనో దూరి పాతికవేల విలువైన నగలు చోరీ చేస్తే వాడిని బందిపోటు అని పిలిచి, పోలీసుల కప్పచెప్పి, కటకటాల వెనక కుక్కుతారు; క్షణికా వేశంలో ఒక యువతిని చెరిస్తే – మానభంగ నేరారోపణపై యావజ్జీవం, ఖైదులో వుంచ మంటారు. కక్షతో పగతో ఒకడు, ఇంకొకడ్ని చంపితే, హంతకుడని నిందించి మరణ శిక్ష విధిస్తారు.

ఇవన్నీ వ్యక్తిగత నేరాలు, కాని శిక్షలు మాత్రం సామాజికమైనవి. ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తికి చెరుపు చేసిన నేరమే అయినప్పటికీ, దానిని అనుమతిస్తే సమాజ జీవనం భగ్నమౌ తుందనే భావంతో ఏర్పర్చిన శిక్షాస్మృతి ఇది. అయితే నేరమే సాంఘిక మైనదైతే – ఆ నేరస్తుడ్ని ఏ చట్టం ప్రకారం శిక్షించాలి? ఆ శిక్ష ఎంత కఠినంగా వుండాలి? కేంద్ర కమ్యూనికేషన్ల మాజీ మంత్రి సుఖ్‌రాం విషయంలో అటువంటి కొత్త చట్టం సృష్టించాల్సిన అవసరం ఏర్పడు తున్నది. రాజకీయాలలో అవినీతి, లంచ గొండితనం, ఆశ్రిత పక్షపాతం వ్రేళ్లూనుకొని వున్న విషయం అందరికీ తెలిసిందే కాని, అది ఇంత వికృతంగా, వికారంగా, కుళ్లిన కళేబరం చందంగా తయారై వుందని సుఖ్‌రాంను చూస్తేనే అర్థమౌ తున్నది. చిత్తు కాగితాలు బస్తాలో కూరినట్లు కరెన్సీ నోట్లను పెట్టెల్లో విసిరేసి మంచాల క్రింద, గోడవార పడవేసి వుంచి వాడట ఆయన. సిబిఐ ఆయన ఇళ్లపై దాడిచేసి స్వాధీనం చేసుకొన్న కరెన్సీ కట్టలు, ఆస్తి కొనుగోలు దస్తావేజులు, షేర్ల సర్టిఫికెట్లు ఒక చోట గుట్టపోస్తే ఒక లారీకి సరిపడా వుంటాయి. ఇళ్లలో మంచాల క్రిందనే 3 కోట్లా 80 లక్షల డబ్బు దొరికింది. బ్యాంకు లాకర్లలో, బంధువుల ఇళ్లలో, గుర్తు తెలియని ప్రదేశాలలో దాచి పెట్టినవి ఇంకెన్ని కోట్లు వుంటాయో మరి! ఒక్క ఢిల్లీలోనే నాలుగు ఇళ్లు; హిమాచల్ ప్రదేశ్‌లో భవనాలు; దుబాయిలో హోటలు, అమెరికాలో ఆస్తులు ఇప్పటికి బయట పడ్డాయి. సాధారణ బందిపోటును లాకప్‌లో వేసి, లాఠీతో దావబాదినట్లు ఈ నీచుడ్ని తన్నగల్గితే ఇంకెన్ని లంచాల కక్కుర్తి పనులు వెలికి వస్తాయో వూహించనే లేము.

ఒక్క రాజకీయ నాయకుడు, ఐదేళ్ల మంత్రిత్వ కాలంలో జాతి సంపదను ఇంతగా దోచుకొంటే – ఇక దేశంలో వున్న వేలాది మంది రాజకీయ వాదులు అరగించిన, అరగిస్తున్న భరతమాత రక్త మాంసాల పరిమాణం ఇంకెంత వుంటుందో అంచనా కట్టగలమా? వీరు చేసేది దేశద్రోహం; వీరు దోచుకొనేది ప్రజలందరి కష్టఫలం; వీరు మానభంగం చేస్తున్నది జాతి గౌరవాన్ని; వీరు హత్య చేస్తున్నది ప్రజాస్వామ్యంపై నమ్మకాన్ని! ఇవన్నీ సామాజిక నేరాలు; సంఘ మంతటినీ మూలుగులతో సహా పీల్చి వేస్తున్న ఘోరాలు; సమాజ జీవనాన్ని కల్మష భరితం చేస్తున్న నీచ కృత్యాలు. ఇటువంటి వారికి కూడా యాంటిసి పేటరీ బెయిల్లు, న్యాయవాదుల రక్షణ, చట్టం పరిధిలో తమను తాము కాపాడు కొనేందుకు అవకాశం ఇవ్వడం మహా పాపం. వీరిని జైళ్లలో పెడితే అక్కడుండే ఖైదీలకు అవమానం. ఇటువంటి వారిని నడివీధిలో ఉరితీసినా, ఖండ ఖండాలుగా తెగ నరికినా, కొరడా తీసుకొని చచ్చే వరకు బాదినా తప్పు లేదు; అందుకు న్యాయ దేవత క్షోభిల్లదు!

**జమీన్‌రైతు**

సుఖ్‌రాం వంటి రాజకీయ వాదులు ఆర్జించిన ఒక్కొక్క కోటి అక్రమ ధనానికి, కనీసం పది పదిహేను కోట్ల ప్రజా ధనం వ్యాపారుల బొక్కసానికి చేరి పోయి వుంటుంది. ప్రజలు కడుపు కట్టుకొని రూపాయి, రూపాయిగా కట్టే పన్నుల సొమ్ము వారి విలాసాలకు హంస తూలికా తల్పాలు పరుస్తుంటుంది. ఏ వ్యాపారి రాజకీయవాదికి వూరకే సొమ్ము ఇవ్వడు. అంతకు పదింతలు ప్రభుత్వ ఖజానా నుంచి రాబట్టు కొంటాడు. ఈ దృష్టితో చూసినప్పుడు సుఖ్‌రాం ఇచ్చిన టెలిఫోన్ కాంట్రాక్టులు, లైసెన్సుల రూపంలో ఎన్నివేల కోట్లు హారతై పోయిందో!

ఈ నీచుడ్ని ఎంతగా సమర్థించాడు మాజీ ప్రధాని పివి? ఎన్నికలకు ముందు అతడు అవినీతికి పాల్పడుతున్నాడనే ఆరోపణ వస్తే – కానేకాదు, సుఖ్‌రాం నీతిమంతుడని ఎంత బల్లగుద్ది వాదించా డాయన? ఇప్పుడు మాత్రం నోరు మెదిపి మాట్లాడడం లేదెందు వల్ల? దీని అర్థం – తెలుసుకో లేనంత క్లిష్టమైన దేమీ కాదు. ఒకరికొరకు ఒకరు దొంగలై దేశాన్ని దోచుకొన్నందు వల్లనే ఒకరినొకరు సమర్థించు కున్నారను కోవాలి!

సుఖ్‌రాం వంటి వారి వల్ల రాజకీయ వాదులంటేనే రోత పుడుతున్నది.

## జమీన్‌రైతు

23-8-46

పేజీలు:6 వెల:0-1-6

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

**వెంకటగిరి చిఱుతపులులు**

వెంకటగిరి జమీందారులు కేవలం వినోదార్థంగా వేటాడుట కొరకు [illegible] పందులు, జింకలు, చిఱుతపులులను అరణ్యములలో ఎక్కువగా వృద్ధి చేసినారు. ఆ చిఱుత పులులు గ్రామములలోను, గ్రామ సమీపములలోను పశువులను విరివిగా చంపి నాశనము చేయుచున్నవి.

దేవునిపల్లి మజరా పంటవారి పల్లి, వెంబులూరు, వెల్లం పల్లి, తీర్థంపాడు, మహాసముద్రం, తిమ్మాయి పాళెం గ్రామములలోను, గ్రామ సమీపములలోను తెలిసి 15 పశువులు చంపబడినవి. తెలియకుండా ఇంకెన్నో?

-రంగినేని రామానాయుడు
వెంకటగిరి తాలూకా కాంగ్రెస్ కార్యదర్శి

**జమీందారీలరద్దు**

ప్రధాని గారి సమాధానంతరం 30మంది శాసనసభ్యులు జమీన్‌దారీ రద్దును గూర్చి చర్చించడానికి పార్టీ సమావేశాన్ని కూర్చమని కోరడం, అందుపై 23వతేది పార్టీ సమావేశాన్ని నిర్ణయించి తిరిగి 2వతేదీకి వాయిదా వేయడం జరిగింది.

**దీర్ఘాయుర్భవ**

ప్రకాశం పంతులు 75వ జన్మోత్సవం ఈ దినము. పంతులుగారికి ఆయురారోగ్యాభివృద్ధు లొసంగుమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

**రంగాగారు స్విట్జర్లాండుకు**

రంగాగారు 21తేది యెక్స్‌ప్రెస్‌లో ఢిల్లీ వెళ్ళినారు. అక్కడ నుండి 25వతేది లండన్ విమానంలో వెళ్లారు. సెప్టెంబర్ 1,2తేదులకు స్విట్జర్లాండు రాజధాని కోపెన్ హగన్ చేరుతారు. అక్కడ జరిగే ప్రపంచ వ్యవసాయదార్ల మహాసభలో ప్రధాన భారత ప్రతినిధిగా పాల్గొంటారు.

ప్రభుత్వానికి రంగాగారి విజ్ఞప్తి: బంజరు భూములు, గ్రామ కంఠ భూములు, అడవులు మొదలయిన జమీన్‌దారులకు హక్కులేని భూములను జమీన్‌దారులు అమ్మకుండా తక్షణ చర్య తీసుకోవాలని రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు రంగాగారు ప్రధాని ప్రకాశం గారిని కోరినారు.

కొరవ 11 పేజీలో

# ఆంధ్ర కాంట్రాక్టర్లు ఆల్మట్టి పనులు చేయకూడదు !

ఆల్మట్టి పనిని ఆంధ్ర ప్రదేశకు చెందిన కాంట్రాక్టర్లు చేస్తున్నట్లు కొన్ని పత్రికల్లో చదివాను. ఇది సహించరాని విషయం. రాష్ట్రానికి అన్యాయం జరుగు తున్నందుకు నిరసనగా వారంతా తమ కాంట్రాక్టులు బహిష్కరిస్తే తెలుగు జాతి తేజాన్ని చాటిన వారవుతారు. ఈ పని చేసిన కాంట్రాక్టర్లు సదా తెలుగు ప్రజల హృదయాల్లో నిలుస్తారు.

నెల్లూరు — టి.వి. నారాయణ

## 50 ఏళ్ల స్వాతంత్ర్యం ఫలం ఇదేనా?

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చి 50 ఏళ్లయ్యింది. స్వాతంత్ర్యం వచ్చినప్పుడు నేను మూడవ తరగతి చదువుతున్నా, ఆ రోజు అనుభవించిన సంతోషం జీవితంలో మరువ లేను. కాని ఈనాడు 50 ఏళ్ల నుంచి సాగిన దేశ ప్రగతిని చూస్తే బాధ కల్గుతుంది. రాజకీయ నాయకుల కుంభ కోణ పరంపరలు, పూడిపోయిన పంట కాల్వలు, గతుకుల రోడ్లు, బక్కచిక్కి పోయిన చెరువు కట్టలు, పని వయసులోనే కూలిపోయే బ్రిడ్జిలు ఎటు చూసినా ఇటువంటివే కనిపిస్తున్నాయి. పాఠశాలకు రాకుండా జీతాలు తీసుకొనే ఉపాధ్యాయులు, లంచాలు ఇవ్వనిదే కాగితం చూడని ఉద్యోగులు, మానభంగాలు, దోపిడీలు, వైద్య సదుపాయాలు లేని ఆసుపత్రులు. 50 ఏళ్ల స్వాతంత్ర్యాన్ని వెక్కిరిస్తున్నాయి. వీటిని గూర్చి ఆలోచించే నాయకులే కరువయ్యారు.

గుడ్లూరివారిపాళెం — ఈ. వెంకురెడ్డి

## జనవాణి

### భూమి యాజమాన్యపు హక్కు పత్రాలివ్వాలి!

జిల్లాలోని రెవిన్యూ అధికారులు కేవలం పట్టాదారు పాసు పుస్తకాలను మాత్రమే రైతుల కిస్తున్నారు. కాని వీటి వల్ల రైతులకు ప్రయోజనం లేదు. దీనితో పాటు భూమిపై యాజమాన్యపు హక్కు పత్రాన్ని కూడా ఇస్తే బాగుంటుంది. గ్రామాల్లో ఎక్కువ భాగం భూములు రైతులకు పిత్రార్జితమై, వంశ పారంపర్యంగా వచ్చినవే. వీటికి ఎటువంటి రిజిస్టర్ పత్రాలు వుండవు. వంశ పారంపర్యంగా, పిత్రార్జితంగా లభించిన భూములపై బ్యాంకులలో రుణాలు పొందాలంటే రిజిస్టర్ అడమానం పెట్టాలి. దీనికి చాలా ఖర్చవు తుంది. భూమి యాజమాన్యపు హక్కు పత్రాన్ని బ్యాంకులో డిపాజిట్టు చేసి రుణాలు పొందవచ్చని పట్టాదారు పాసు పుస్తక చట్టంలో స్పష్టంగా చెప్పబడి వుంది. అందు చేత రైతులకు

కొరవ 11 పేజీలో

# అందరూ సహకరిస్తే నెల్లూరులో మోడల్ రైల్వే స్టేషన్!

నెల్లూరు రైల్వే స్టేషన్‌లో ఇది వరకు ఏ కార్యక్రమమైనా గుట్టుగా జరిగి పోయేది. ఆ సంస్కృతికి నెల్లూరు ఎమ్పీ పనబాక లక్ష్మి పుల్‌స్టాప్ పెట్టించారు. 17వతేది రైల్వే స్టేషన్‌లో కంప్యూటరైజ్‌డ్ గ్లోబల్ రిజర్వేషన్ కేంద్రం ప్రారంభోత్సవ కార్యక్రమాన్ని ఘనంగా జరిపించారామె. అదే సభలో ఆంధ్రాబ్యాంక్ క్రెడిట్ కార్డు ద్వారా రైలు టిక్కెట్లు కొనుగోలు చేసే సౌకర్యానికి నాంది పల్కారు.

గ్లోబల్ రిజర్వేషన్ కేంద్రం అంటే - దేశంలోని అన్ని ప్రధాన నగరాలకు సంబంధించిన రైలు టిక్కెట్లను ఇక్కడి నుంచి కొనుగోలు చేసే సౌకర్యం కల్పించడం. ఢిల్లీ నుంచి బొంబాయికి లేదా కలకత్తా నుంచి మద్రాసుకు రిజర్వేషన్ టిక్కెట్ కావాలంటే నెల్లూరులోనే కొనేయ వచ్చు. ఇటువంటి కంప్యూటర్ సెంటర్లు వున్న ప్రతి నగరానికి ఇప్పుడు నెల్లూరుతో అను సంధానం ఏర్పడుతుంది. ఈ కేంద్రం సాధించడం - శ్రీమతి లక్ష్మి కృషే! అందువల్ల దీనికి ఆమె రిబ్బను కత్తిరించారు. ఈ కార్యక్రమంలో పాల్గొన్న దక్షిణ మధ్య రైల్వే డివిజనల్ మేనేజర్ శ్యామ్‌కుమార్ మాట్లాడుతూ గ్లోబల్ రిజర్వేషన్ కౌంటర్లు డివిజన్‌లోని విజయవాడ, గుంటూరు స్టేషన్లలో మాత్రమే వున్నట్లు చెప్పారు. స్టేషన్ తూర్పు వైపు మరో టిక్కెట్ కౌంటర్‌ను కూడా ఏర్పాటు చేయుస్తున్నారు. రైళ్లలోని వివిధ బోగీలు ఎక్కడ ఆగుతాయో తెలియజేసే బోర్డులు ప్లాట్‌ఫారం పై ఏర్పాటు చేయిస్తానని ఆయన ఈ సందర్భంగా హామీ ఇచ్చారు. పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి పనబాక

## ఎమ్పీ లక్ష్మి హామీ

లక్ష్మి మాట్లాడుతూ చార్మినార్‌లో మద్రాసు వెళ్లే ప్రయాణీకులు రిజర్వేషన్ ఛార్జీలు కట్టవలసి రావడంపై రైల్వే అధికారులతో మాట్లాడి వాటిని రద్దు చేయించానని; మంగళ, కోరమండల్ ఎక్స్‌ప్రెస్‌లు నెల్లూరు స్టేషన్‌లో నిలిపేందుకు ఉత్తర్వు లిస్తానని రైల్వే మంత్రి హామీ ఇచ్చారని చెప్పారామె. మద్రాసు నుంచి సబర్బన్ రైళ్లు నెల్లూరు వరకు వస్తాయంటూ; స్టేషన్‌లో శుభ్రతకు శానిటరీ ఇన్‌స్పెక్టర్‌ను ఏర్పాటు చేయమని రైల్వే జనరల్ మేనేజర్‌ను కోరారు. పిజన్ లాంజ్‌ను ఏర్పాటు చేయమని కూడా చెబుతూ, ప్రతివిషయాన్ని మంత్రి దగ్గర ప్రస్తావించలేమని, అధికారులే చిన్న చిన్న సౌకర్యాల సంగతి చూడాలని సలహా యిచ్చారు. అందరి సహకారంతో నెల్లూరు రైల్వే స్టేషన్‌ను మోడల్ స్టేషన్ చేసేందుకు యత్నిస్తా నన్నారామె. ఆంధ్రా బ్యాంక్ ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ గనేగా మాట్లాడుతూ దేశంలో క్రెడిట్ కార్డులను మొట్టమొదట ఆంధ్రా బ్యాంక్ ప్రవేశ పెట్టినట్లు చెప్పారు. అసిస్టెంట్ జనరల్ మేనేజర్ బి.శంకరరావు గుప్త మాట్లాడుతూ క్రెడిట్ కార్డులతో ఎల్.ఐ.సి ప్రీమియం, పెట్రోల్ బంకులలో పెట్రోలు కూడా పోయించు కోవచ్చన్నారు. మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి మాట్లాడుతూ నెల్లూరు ఆంధ్రా బ్యాంకు తమ ఖాతాదారులకు అల్లుడి మర్యాదలు చేస్తుందన్నారు. ఏ ఎమ్పీ కూడా నెల్లూరు నాయకులను స్టేషన్ వరకు పిలవలేదని, లక్ష్మి ఒక్కరే ఆ గౌరవం ఇచ్చారని ప్రశంసల వర్షం కురిపించారాయన. రైల్వే శాఖ డిసిఎం

కొరవ 10 పేజీలో



ఠాగూర్ జయంతి సభలో సి.హెచ్ సూర్యనారాయణ రావును సన్మానిస్తున్న బెజవాడ గోపాలరెడ్డి, పివి రమణారెడ్డి, అగస్త్యరెడ్డి వెంకు రెడ్డి, పొన్నాల రామసుబ్బారెడ్డి.

## ● సణుగుడు ●

* సెబాష్ ఎస్పిగారూ!

* చెత్త ఎత్తించడం సిఎం కర్తవ్యమా?

షార్ కేంద్రంలో ఆ మధ్య జరిగిన తల్లి, ఇద్దరు బిడ్డల హత్యా కేసును పరిశోధించడంలో జిల్లా పోలీసు యంత్రాంగం చూపిన చొరవను, సమర్థతను ప్రశంసించాలి. హాలీవుడ్ క్రైం సినిమా తరహాలో ఈ హత్యలు జరిగితే, స్కాట్‌లాండ్ యార్డ్ గూఢచారి విభాగం నైపుణ్యంతో నేరస్థులను పట్టి, చట్టానికి అప్పు చెప్పారు మన పోలీసులు.

నామటుకు నాకు మన పోలీసుల పైన; మరి ముఖ్యంగా నెల్లూరు జిల్లా పోలీసుల పైన ఇటువంటి వాకచక్యం ప్రదర్శించ గలరన్న నమ్మకం ఏ మాత్రం లేదు. ఫారెన్ సెంట్ పూసినా వదలని రాజకీయ దుర్వాసనతో కంపుకొట్టే దుస్థితి మన పోలీసులది. ఎక్కడో ఒకటి అరా సమర్థత, నిజాయితీ, నిర్మొగమాటం కలిగిన సిబ్బంది కన్పడినా వారు ఏ స్టేషన్‌లోనూ నాలుగు వారాలకు మించి వుండలేరు; ఏ చప్పు ఎమ్మెల్యే ఆగ్రహానికో బదలీ శిక్షకు గురి కాకుండా బ్రతక లేరు. నాయకుల కొలువు కొల్చుకొంటూ, వారి తాబేదార్ల ఆజ్ఞలకు జీహుజూర్ చెప్తూ, అమాయక జనాన్ని మాత్రం వేధించుక తింటూ బ్రతక గలిగేవాడే పదికాలాల పాటు మనశాంతితో మనగల్గిన వాతావరణంలో - పోలీసుల్లోని సమర్థత, నేర్పు, నైపుణ్యం, చిత్తశుద్ధి, విధి నిబద్ధత వంటి చెత్త పదాలకు చోటు ఎట్లా వుంటుంది?

### డోలేంద్ర

ఇటువంటి "నిర్వీర్య, నిరుపయోగ" లక్షణాలు వున్న అధికారులు - అవెక్కడ తమ అసర్థతలుగా పరిగణింప బడతాయోనని ఇతరులకు కన్పర కుండా దాచి పెట్టుకొంటుంటారు.

అందువల్లే జనం పోలీసు స్టేషన్ల జోలికి పోవడం మానేశారు. చిన్న చిన్న చోరీలైతే అసలు రిపోర్ట్ చేయడం దండగనే అభిప్రాయమూ సర్వత్రా వుంది.

కొరవ 8 పేజీలో

# చెప్పేది మేలు రకమని - ఇచ్చేది నాసిరకం బియ్యం!

జిల్లాలోని కావలి, గూడూరు, నెల్లూరు మునిసిపల్ పరిధిలోని రేషన్ కార్డుదారులకు మేలు రకం బియ్యాన్ని 6.50 రూ. లెక్కన పంపిణీ చేస్తారు. దీని కోసం ఆగస్టు నెలలో 800 మెట్రిక్ టన్నుల బియ్యాన్ని కేటాయించారు. కావలి 135, గూడూరు 145, నెల్లూరు డివిజన్‌కు 520 టన్నుల లెక్కన వీటిని పంచారు. తెల్ల రేషన్ కార్డుల వారికి కూడా వీటిని కార్డుకు 25 కిలోలు మించకుండా ఇస్తామని జాయింట్ కలెక్టర్ డాక్టర్ ఎన్. నాగేశ్వర రావు

### నెల్లూరు సంగతులు

తెలియ జేస్తున్నారు. అయితే ఈ బియ్యం పరమ నాసిరకంగా వుంటున్నాయి. ప్రకటనలో మాత్రం మేలు రకం బియ్యమంటున్నారు. ఒకసారి స్టాక్ పాయింట్‌ను సందర్శించండి సార్!

### రోటరీ క్లబ్ సమావేశం

నెల్లూరు రోటరీ క్లబ్ సమావేశం 21వతేది క్లబ్ అధ్యక్షుడు కె.బాల సుబ్రహ్మణ్యం అధ్యక్షతన జరిగింది. ఆర్టీసీ రీజనల్ మేనేజర్ బి.సీతారాం ముఖ్య అతిథిగా విచ్చేసి ఆర్టీసీ బస్సులు మరింత మెరుగు పర్చే సూచనలను ఆహ్వానించారు. రొటేరియన్ యన్నమూరి వెంకటేశ్వరరావు దీనికి స్పందిస్తూ బస్సులలో శుభ్రత లేదని, లోపల పెట్టుకొనే క్యారియర్లు మట్టితో నిండి వుంటున్నాయని చెప్పారు. నెల్లూరు రైల్వే స్టేషన్‌కు ఆర్టీసీ బస్సులు నడిపేందుకు ఆర్.ఎం. కృషి చేయాలని కోరారు. ఆర్టీసి బస్టాండులో త్రాగునీటి వసతి టాయిలెట్లు పరిశుభ్రత బాగోలేదని రొటేరియన్ పొమ్మిన సుబ్రహ్మణ్యం సూచించారు. క్లబ్ సభ్యులు ఎం.ధర్మారెడ్డి, పెంచలయ్య తదితరులు సభలో మాట్లాడారు. బి.ఆర్.కృష్ణమూర్తి చివరన వందన సమర్పణ చేసారు.

### ఎమ్పీగారు సాధించిన పనులు!

ఇటీవల పార్లమెంటు సమావేశాలకు ఢిల్లీవెళ్లి తాను సాధించు కొచ్చిన వివిధ పనులను 17వతేది రైల్వే స్టేషన్‌లో ఎమ్పీ శ్రీమతి పనబాక లక్ష్మి విలేకరులకు వివరించారు. రాచర్లపాడులో ఇఫ్కో ఫ్యాక్టరీ శంకుస్థాపన విషయమై ప్రధాని దేవగౌడని కలసి అడిగితే ఎటువంటి అభ్యంతరం లేదని చెప్పారట. శంకుస్థాపనకు ముహూర్తం నిర్ణయించడమే ఆలస్య మన్నారామె. నెల్లూరు టౌన్‌లో బైపాస్ రోడ్డు పనులు వెంటనే పూర్తి చేయడానికి సంబంధిత మంత్రి అంగీకరించారని; రాపూరు, ఆత్మకూరు, కోట, వాకాడు, అల్లూరులలో గ్యాస్ ఏజన్సీలను తెచ్చిపెడతానని చెప్పారు. నెల్లూరు టెలిఫోన్ ఎక్ఛేంజిని ఎలక్ట్రానిక్ ఎక్ఛేంజిగా మార్చేందుకు రంగం సిద్ధమైందని చెప్పారు. తనపియోజక వర్గ అభివృద్ధి నిధి నుంచి 50లక్షల నిధులు విడుదల అయ్యాయని, ముఖ్యమైన సమస్యల పరిష్కారానికి వీటిని ఖర్చు చేస్తానని తెలియ జేసారు. గూడూరు నెల్లూర్యాస్టే కార్మికులకు గృహాలు నిర్మించి ఇచ్చే విషయమై కార్మిక మంత్రిని కూడా ఆమె కలిసారట. పొదలకూరుకు చెందిన

కొరవ 10 పేజీలో

# కవిత్వలక్షణాలన్నీ గీతాంజలిలోనేవున్నాయి!

విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ జయంతి వేడుకలు ఆయన ప్రత్యక్ష శిష్యుడు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షతన 18వతేది టౌన్‌హాల్‌లో జరిగాయి. సభలో గోపాలరెడ్డి మాట్లాడుతూ విశ్వకవి రవీంద్రుని గీతాంజలి భారతీయులకు మూలధనం. గీతాంజలిలో నిండి నిబిడీ కృతమైవున్న ఆధ్యాత్మికవాణి, పాశ్చాత్య పండితులను ప్రజలను ఆకర్షించింది. గీతాంజలి బెంగాలీ నుండి ఆంగ్లీ కరించబడింది. ఆంగ్లం నుండి సంస్కృతీ కరించ బడింది. అందుకే గీతాంజలిని ఊర్ధ్వస్రోతస్విని అంటే సముచితంగా వుంటుందన్నారు.

రవీంద్రుని గీతాంజలిని సంస్కృతీ కరించిన ప్రముఖ పండితులు చింతగుంట సూర్యనారాయణ రావు ప్రధానోపన్యాసం గావించారు. విశ్వాన్ని తన కవితా తత్వం చేత అలరించిన రవీంద్రుడు గీతాంజలిలో రససిద్ధుడుగా, కవిగా, ప్రేమికుడుగా, యోగిగా దర్శనమిస్తాడు. రవీంద్రుడు భక్తి రసాన్ని గీతాంజలి ద్వారా ఒక హృదయం నుండి మరొక హృదయానికి ప్రసరింప చేశాడు. ఉత్తములు చెప్పిన కవితా లక్షణాలన్నీ గీతాంజలిలో పొందు పరచి వున్నట్లు చెప్పారాయన. సభా పోషకులు పి.వి.రమణారెడ్డి వక్త ఠాకూర్ అవార్డుతో సన్మానించారు. వర్ధమాన

### రవీంద్ర జయంతి

సమాజం కార్యదర్శి పొన్నాల రామసుబ్బారెడ్డి చివరన వందన సమర్పణ చేసారు.

### ఎల్ఐసి జీవన సురక్ష

జీవిత భీమా సంస్థ కొత్తగా ప్రవేశ పెడుతున్న జీవన సురక్ష పథకం వివరాలను నెల్లూరు డివిజనల్ మేనేజర్ అనంతరామ గుప్త విలేకరులకు వివరించారు. 30 ఏళ్లు నిండిన వారెవరైనా ఈ పథకంలో చేరేందుకు అర్హులు. నెలకు కనీసం 150 రూపాయల లెక్కన చెల్లిస్తే, పాలసీ దారుడు ఎంచుకొన్న వయస్సుకు అతని కుటుంబానికి తగిన పెన్షన్ చెల్లిస్తారు. స్వయం ఉపాధిదారులకే కాకుండా, వుద్యోగస్తులకు కూడా ఎంతో ప్రయోజన కారమని వివరించారు. పెన్షన్ దారుడు ప్రీమియం చెల్లింపు కాలంలో అకాల మృత్యువు పాలైనప్పుడు వారి కుటుంబానికి ఈ పెన్షన్‌ను ఇస్తారట. స్త్రీలు కూడా ఈ పథకంలో చేరవచ్చున డివిజనల్ మేనేజర్ వెల్లడించారు.

### తిక్కన విజ్ఞాన్ కేంద్రం సాహిత్యోపన్యాసం

నెల్లూరు తిక్కన విజ్ఞాన కేంద్రం 30వతేది టౌన్‌హాల్‌లో సాహిత్యోపన్యాసం ఏర్పాటు చేసింది. విజయవాడ సిద్ధార్థ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి ఇంగ్లీషు డిపార్ట్‌మెంట్ హెడ్ వేగుంట మోహన్‌ప్రసాద్ ఆధునిక కవితా యుగంలో కవిత అనే అంశంపై ప్రసంగిస్తారు.

## నెల్లూరు నలుచెరగుల్లో
### విలక్షణుడు

### జనార్దనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి ఈసారి ఏకంగా పన్నెండు రోజులు నెల్లూరు పర్యటన పెట్టుకొన్నారు. 27తేది ఉదయం మద్రాసు మీదుగా వాకాడు వస్తారు. 28 గూడూరు, నెల్లూరు; సాయంత్రం సూళ్లూరుపేట; 29 కోట, చిట్టమూరు, నెల్లూరు; 30తేది నెల్లూరు; సాయంత్రం తిరుపతి; 31 నుంచి 4తేది వరకు వాకాడు; 5తేది తిరుమల వెంకన్న దర్శనం; 6తేది వాకాడు; 7తేది మద్రాసు మీదుగా వాయుమార్గాన హైదరాబాదు.

### ఎమ్‌సెట్‌లో పేద విద్యార్థి ఘనత

మొన్న జరిగిన ఇంజనీరింగ్ ఎంట్రన్స్ పరీక్షలో అల్లూరుకు చెందిన



నలగట్ల సురేష్ కుమారరెడ్డి అనే విద్యార్థి రాష్ట్ర స్థాయిలో ప్రథమ ర్యాంకు సాధించాడు. సురేష్ తండ్రి రామచంద్రారెడ్డి - నిరుపేద రైతు కుటుంబీకుడు. కొడుకుని ఖరీదైన కోచింగ్ సెంటర్లలో చదివించే స్థోమత లేనివాడు. అందువల్ల అల్లూరులోని రామకృష్ణ జూనియర్ కాలేజిలోనే అతి కష్టం మీద చదివించాడు. ఆ పిల్లవాడి చదువు కోసం, అతడి అక్క తన చదువును త్యాగం చేసిందట. ఆమె సైతం అసాధారణ ప్రతిభా వంతురాలు. ఇంటర్‌లో ఆమెకు లెక్కల్లో 150కి 150 మార్కులు వచ్చాయి. ఇద్దర్నీ కాలేజికి పంపే స్థోమత లేక పోవడంతో, ఆమె సర్దుకొని, ఈ పిల్లవాడికి అవకాశం ఇచ్చింది. ఆ త్యాగానికి తగినట్లే ఆ పిల్లవాడు అద్భుతంగా చదివాడు; స్టేట్ ఫస్ట్ ర్యాంకు సాధించాడు. ఇంటర్‌లోనూ అతడికి 88.6 శాతం మార్కులు లభించాయట. సురేష్‌కు, అతడి సోదరి కుమారి - ప్రసన్నకు, తండ్రి రామచంద్రా రెడ్డికి కూడా జమీన్ రైతు శుభాభినందన లందజేస్తున్నది.

### నారాయణ కోచింగ్ సెంటర్ ర్యాంకుల రికార్డు

ఇంటర్మీడియట్, మెడిసెన్‌లలో వలెనే, ఇంజనీరింగ్ ఎంట్రన్సు లోనూ నారాయణ రికార్డు సృష్టించారు. ఆయన దగ్గర కోచింగ్ అందుకున్న విద్యార్థులలో 500 మంది ఇంజనీరింగ్ సీట్లకు అర్హత పొందారు. రాష్ట్రంలో మరే విద్యా సంస్థ కూడా ఇందరు విద్యార్థులను తీర్చి దిద్దడం జరగలేదు. 100 లోపు ర్యాంకులలో నారాయణకు 14 ర్యాంకులు లభించాయి. 10 లోపు ఇద్దరు పిల్లలు ర్యాంకులు సాధించారు.

ఈ విజయ గాథను నాలుగైదు పంక్తులలో వివరించడం సాధ్యం కాదు. పై వారం వివరంగా ముచ్చటించు కుందాం. నారాయణకు మా అభినందనలు.

### ట్యూషన్ల రభస

టౌన్‌లోని కాలేజి లెక్చరర్లు ప్రైవేటు ట్యూషన్లు చెప్పే వివాదం పెద్ద రగడగా తయారైంది. వి.ఆర్. కాలేజి కరస్పాండెంట్ ఆనం వివేకానంద రెడ్డికి దోషులైన లెక్చరర్లకు సంబంధించి ఎన్ని సాక్ష్యాలు ఇచ్చినా చర్య తీసుకోవడం లేదని; పైగా లెక్చరర్లను ప్రోత్సహిస్తున్నాడని విద్యార్థులు ఆగం చేశారు. రాస్తారోకో జరిపి, గడ్డిబొమ్మ తగల బెట్టారు. దీనిపై ప్రిన్సిపల్ డాక్టర్ గోపాల కృష్ణ మూర్తి, ఇతర అయ్యవార్లు ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి భవిష్యత్‌లో తమ లెక్చరర్లెవరూ ట్యూషన్లు చెప్పరని హామీ ఇచ్చారు.

### ఈశ్వరరెడ్డి మరణం

ఈదూరు రైతు, మద్రాసులో కంకర వ్యాపారం చేస్తూ అక్కడే స్థిరపడిపోయినా గ్రామ రాజకీయాలలో చివరి వరకు చురుకైన పాత్ర వహించిన స్నేహపాత్రుడు శ్రీ పోలంరెడ్డి ఈశ్వర రెడ్డి 20 తేది మద్రాసులో

కొరవ 8 పేజీలో



# నాలుగు కోట్ల విలువైన భూమి ఫోర్జరీపత్రాలతో ఆక్రమించేస్తున్నారు!

జి

నెల్లూరు - పొదలకూరు రోడ్డులో, వెంగళరావు నగర్‌కు ఆనుకొని వున్న 164 ఎకరాల బీడు భూమిని ఆక్రమించి అమ్ముకోవడానికి కొందరు కాంగ్రెస్ వాదులు విశ్వ ప్రయత్నం చేస్తున్నారు. మాగుంట మునిసిపల్ చైర్మన్ దళపతి సందాని భాష దీనికి కీలక పాత్రధారి; సిపిఎంకు చెందిన కొందరు పెద్దలు ఈ కుట్రలో భాగస్వాములు. ఎకరా రెండు నుంచి ఆరేడు లక్షల వరకు ధర పలికే ఈ భూమి మొత్తం విలువ 4 నుంచి ఆరు కోట్ల వరకు వుంటుందట. దాన్ని ప్లాట్లు చేసి అమ్మితే అంతకు రెట్టింపు విలువ ఏర్పడుతుంది.

ఈ భూమి శ్రీదేవిరెడ్డి కోదండ రామిరెడ్డి కుటుంబ ఆస్తి. 1950 ప్రాంతాలలో వారి భూమి కొనుగోలు చేశారు. తర్వాత భూసంస్కరణల చట్టం అమలులోకి రావడంతో, దీన్ని కాపాడుకోవ డానికి అడ్డమైన దారులన్నీ తొక్కారు. ఇంకొకరి పేరుతో అమ్మినట్లు కాగితాలు సృష్టించడం, డిక్లరేషన్లలో తప్పుడు లెక్కలు చూపడం వంటివన్నీ సాధారణంగానే జరిగి పోయాయి. క్రింది నుంచి పై వరకు కోర్టులు, ట్రిబ్యునళ్ల న్నింటిలోనూ వ్యవహారం నడిచింది. ఇప్పటి వరకు అక్రమంగానో, సక్రమంగానో ఆ భూమి వారి ఆధీనంలోనే వుంది. కాని దాన్ని సాగు చేయడం కాని, ఇళ్ల స్థలాలకు అమ్మడం కాని జరగలేదు.

దేవి రెడ్డి కోదండ రామరెడ్డి బినామీగా పెట్టిన కొందరు హరిజనులను ప్రలోభపెట్టి, ఆ భూమి స్వాధీనం చేసుకోవడానికి విడవలూరు రాజకీయ వాది పాశంరెడ్డి సుబ్బరామ రెడ్డి 1987లో ఒక ప్రయత్నం చేశారట. కాని అప్పట్లోనే వారు ఆయనకు పదిలక్షల వరకు ముట్టచెప్పి, ఆ ప్రయత్నం విరమింప జేశారట. ఒక దొంగ విక్రయ అగ్రిమెంట్ ఆధారంగా అప్పుడీ ప్రయత్నం జరిగింది.

సందాని భాష, మరికొందరు మాగుంట ముఖ్యుల కళ్లు ఇప్పుడు దీనిపై పడ్డాయి. తమ పలుకుబడి వుపయోగించి వారు 1993లో నెల్లూరు ఎమ్మార్వో చేత ఒక ఆర్ఓఆర్ సృష్టించారు. దాని ఆధారంగా ఒక జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ (30-10-1993 తేది) సృష్టించారు. 94 మే 30 తేది 20 ఎకరాలు తమ పేర రిజిష్టర్ చేయించు కున్నారు. అయితే రహస్యంగా జరిపిన ఈ దొంగ పనిలో సరైన సమాచారం లేక సర్వే నంబర్లు తప్పురాసి రిజిష్టర్ చేయించు కున్నారట. దీనిపై కోదండ రామిరెడ్డి కుటుంబ సభ్యులు కోర్టుకు వెళ్లారు. ఈ భూమిలో కొంత భాగం కోదండ రామిరెడ్డి 1985 లోనే నెల్లూరు స్టేట్ బ్యాంకులో తాకట్టు పెట్టి వుండడాదట. ఈ భూబకాసురులకు అదీ తెలియలేదు. 1985లో ఒకరు తాకట్టు పెట్టిన భూమి 1995లో ఇతరులెట్లా అమ్మగలరు?

ఇంకొక 14 ఎకరాల 70 సెంట్ల భూమికి షేక్ ఫక్రుద్దీన్ అనే బినామీ వ్యక్తి పేరుతో 1970 మార్చి 6 తేదితో ఒక విక్రయ అగ్రిమెంట్ సృష్టించి, దాని ఆధారంగా తమ పేర్లతో 1995 ఫిబ్రవరి 9 తేది రిజిష్టర్ చేయించారట. అది ఫోర్జరీ విక్రయ అగ్రిమెంట్ అని బయటపడి, కోదండ రామరెడ్డి కుటుంబ సభ్యులు క్రిమినల్ కేసు పెట్టడానికి సిద్ధపడడంతో సందాని భాష భయపడి, వారితో రాజీకి వచ్చాడట. ఆ రాజీ ప్రకారం 14 లక్షల 52 వేల రూపాయలు కోదండ రామరెడ్డి కుటుంబ సభ్యులకు తాను చెల్లిస్తాననీ, తనపై కేసు విత్‌డ్రా చేసుకోవాలని రాజీ పరతుకు అంగీకరించి, కాగితాలపై సంతకాలు చేశాడు. కానీ ఆ డబ్బు కట్టలేదు.

**కలెక్టర్ గారూ — తక్షణం ఆ భూమి స్వాధీనం చేసుకోండి!**

ఇంకొక భాగం భూమికి వాకా బాలకోటా రెడ్డి అనే వ్యక్తి పేరుతో ఇదే ప్రకారం ఒక జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ సృష్టించారు. ఈ దశలో సిపిఎం నాయకుడు, న్యాయవాది శ్రీ పలి బలరామయ్య ఈ భూ ఆక్రమణలో భాగం పంచుకు న్నట్లుంది. బలరామయ్య కుటుంబీకుల పేరుతో కొన్ని రిజిష్టర్ పత్రాలు తయారై పోయాయి.

ఇట్లా పలురకాల ఫోర్జరీ పత్రాలు సృష్టించి వారు మొత్తం 164 ఎకరాలూ స్వాధీనం చేసుకున్నారు. తమ అక్రమ ఆక్రమణలకు అధికార ముద్ర వేయడం కోసం వివిఒను, ఎమ్మార్వోలను బెదిరించి, భయపెట్టి రెవిన్యూ రికార్డులలో, అడంగల్‌లలో తమ పేర్లు నమోదు చేయించారట. తాము చెప్పిన మాట వినని ఒక వివిఒపై హరిజన అత్యాచారం కేసు దాఖలు చేయించి, బ్లాక్ మెయిల్ చేసి, బలవంతంగా సంతకాలు చేయించారట. ఇప్పుడు పాస్ బుక్‌ల జారీ కోసం పెద్ద ఎత్తున ఒత్తిడి తెస్తున్నారు. మాగుంట పెద్దలతో పాటు, మార్కెటింగ్ మంత్రితో తమకున్న చనువును ఈ అక్రమ వ్యాపారానికి వాడుతున్నట్లున్నారు.

ఏమిటీ అన్యాయం? టౌన్ శివార్లలో 164 ఎకరాల సీలింగ్ భూమి వుంటే - అది ప్రభుత్వానికి ఎన్నో రకాలుగా వుపయోగ పడుతుంది. దాన్ని భూబకాసురుల అక్రమ ఆక్రమణాలకు వదిలి వేయడం నేరం. ఫోర్జరీ పత్రాలతో, బ్లాక్ మెయిల్ టెకడలతో, రెవిన్యూ అధికారుల కుమ్మక్కుతో ఇంత పెద్ద భూ ఆక్రమణ జరిగి పోతుంటే కలెక్టర్ గారు చూస్తూ వూరుకోవడం బాగాలేదు.

కొరవ 8 పేజీలో

# నేను అవకాశవాదిని కాను - రాజకీయాలలో చేరను!

అటీవల రజనీ కాంత్‌ను మద్రాసు విమానాశ్రయంలో మూడు నిమిషాల పాటు మినీ ఇంటర్వ్యూ చేయడం జరిగింది.

"మీరు రాజకీయాల లోకి ప్రవేశించ వచ్చని హిందీ నటుడు శత్రుఘ్నసిన్హా చెప్పారే?"

"అది ఆయన అభిప్రాయం కావొచ్చు."

"మూపనార్ కోరిక మేరకు తమిళమానిల కాంగ్రెస్‌లో మీరు చేరబోతున్నారని విన్నాం."

"నేను ఏ పార్టీలోనూ చేరబోయేది లేదు. నేను రాజకీయాలకు పనికిరాను. జయలలితను గద్దెదింపడంలో నా వంతు ప్రయత్నించాను. ఫలించింది. అంతే నా పని."

"ఐతే, భవిష్యత్తులో కూడా రాజకీయాలలో చేరనంటారా?"

"నేను అవకాశవాదిని కాను - రాజకీయాలలో చేరడానికి? నేనిప్పుడు హాయిగా ఉన్నాను. ఏటా ఒక సినిమాలో నటిస్తాను. కథ, పాటలు, స్టంట్లు బాగా ఉండేలా చూసుకుంటాను. గనుపాటిగా హిట్ అవుతుంది. ఇతర భాషల్లోకి డబ్ అవుతుంది. నిర్మాతకు పుష్కలంగా డబ్బొస్తుంది. ఇంత కంటే ఏం కావాలి? ప్రజా సేవ చేయడానికి రాజకీయాలలోకి

**రజనీకాంత్‌తో జమీన్‌రైతు మినీ ఇంటర్వ్యూ**

ప్రవేశించ నక్కర్లేదుగా? నేనిప్పుడు కాస్తో కూస్తో ప్రజా సేవ చేస్తూనే వున్నానే. పరమాత్మ చింతనలో నా శేష జీవితాన్ని గడుపుతాను. ఐహిక సుఖాలన్నీ అనుభవించేశాను. నాకిక ఏం కావాలి? సర్వజనులూ సుఖంగా ఉండాలి. అదే నే కోరుకునేది," అని జవాబిచ్చారు రజనీకాంత్.

## దాసరి కొత్త చిత్రం

"కలుపు తీప" అనే చిత్రాన్ని సౌందర్య నాయికగా నిర్మిస్తారట. బొంబాయిలో రెండేళ్ల పాటు ట్రెయినింగ్ పొంది వచ్చిన తన రెండో కుమారుడు అరుణ్ కుమార్ హీరోగా ఒక చిత్రానికి దాసరి సన్నాహాలు చేస్తున్నారు.

## "కామ్రేడ్"

"హీరో తిరుగుబాటు మనస్తత్వం గలవాడు. భూ ఆక్రమణదారుల పీడనపై తిరుగుబాటే ఈ చిత్రంలోని ప్రధానాంశం," అన్నారు డాక్టర్ ప్రభాకర్ రెడ్డి. ఈయన దర్శకత్వం వహిస్తున్న "కామ్రేడ్" చిత్రంలో భానుచందర్, శ్రీకన్య, రాజశ్రీ, లక్ష్మీప్రియ, స్పందన, రామలక్ష్మి, నల్రా, జీవా, కోట శంకరరావు తదితరులు పాత్రధారులు. సంగీతం: జె.వి.రాఘవులు.

# కన్నడ నిర్మాతతో మాలాశ్రీ పెండ్లి!

పెళ్లి విషయాన్ని రహస్యంగా ఎందుకుంచాలి? కన్నడ నిర్మాత రామూను పెళ్లి చేసుకో బోతున్నాను. ఆయన ఇప్పుడు మా నివాసానికి ఒక భవంతి బెంగుళూరులో నిర్మిస్తున్నారు. పాణిగ్రహణం, గృహప్రవేశం త్వరలోనే జరుగుతాయి, అంది మాలాశ్రీ.

## దాసరి తొలిచిత్రం

హైదరాబాద్ టిహెచ్ఏఎల్‌లో ఉద్యోగం చేస్తున్నప్పుడు దాసరి నారాయణ రావు 'రవీంద్ర భారతి'లో ఒక నాటకం ప్రదర్శించాడు. అది చూసిన ప్రొపికెక్ పిక్చర్స్ కృష్ణయ్య ఆయనకు తన "అందంకోసం పందెం" చిత్రంలో చక్కని వేషం ఇస్తానన్నారు. కాని దాసరి, మద్రాసు చేరుకోవడం కాస్త ఆలస్యమై నందున ఆ పాత్ర మరొకరు వేశారు. దాసరికి ఏమి చేయడానికీ తోచలేదు. ఆ చిత్ర దర్శకుడు నెల్లూరీయుడు ఆమంచర్ల శేషగిరి రావు "ఎటూ ఇంత దూరం వచ్చారు కదా? వేషం వెయ్యకుండా వెళితే ఎలా; మరో వేషం ఇస్తానన్నారు. ఏం వేషం వేయక హైదరాబాద్ వెళ్లిపోతే అక్కడి తన మిత్రులకు ఏమని సమాధానం చెప్పాలో అని మధన పడి, చివరికి దాసరి ఆ చిత్రంలో చిన్న వేషమే వేశాడు. అనంతరం దర్శకుడిగా అంచె లంచెలుగా ఎదిగాక దాసరి పరిపూర్ణమైన నటుడుగా కనిపించింది "స్వర్గం-నరకం" చిత్రంలో ఆచారిగా.

## గన్‌షాట్

తెలుగుదనం ఉట్టిపడేటట్లు చిత్రాలు తీసే మనీషా ఫిలిమ్స్ కొత్త చిత్రం టైటిల్‌ను "గన్‌షాట్" అని ఇంగ్లీషులో పెట్టింది. అలీ హీరో, ప్రకాష్ రాజ్, కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, బాబూమోహన్, ఎవిఎస్, భరణి, శివాజీ రాజా, మల్లికార్జున రావు, గణేష్, రాళ్లపల్లి, గుండు హనుమంత రావు, వై. విజయ, శ్రీలక్ష్మి పాత్రధారులు. మాటలు దివాకర్ బాబు, కథ శ్రీనోష్ల, సంగీతం, దర్శకత్వం ఎస్.వి. కృష్ణా రెడ్డి.

**పాణిగ్రహణం, గృహప్రవేశం ఒకేరోజు!**

## అమ్మా! అమ్మను చూడాలని వుంది

సాగర్ దర్శకత్వం వహిస్తున్న పై చిత్రానికి ఇటీవల మద్రాసులో ఒక పాటను చిత్రీకరించారు. వినోద్ కుమార్, రమ్యకృష్ణ, చంద్ర మోహన్, రాజా రవీంద్ర, జె.వి. సోమయాజులు, బ్రహ్మానందం, ఎవిఎస్, వేలు, బాబూ మోహన్, ఐరెన్ లెగ్ శాస్త్రి, మంజుల, బేబీ దీపిక, లతాశ్రీ నటీవర్గం. కథ, మాటలు జి. సత్యమూర్తి, సంగీతం కోటి.

## ఏమండీ ... మనమ్మాయే

ఆనంద్, రమ్యకృష్ణ, వాణిశ్రీ, బ్రహ్మానందం, అలీ, రాళ్లపల్లి, చలపతి రావు, వై. విజయ నటించే "ఏమండీ ... మనమ్మాయే" చిత్రానికి షౌం దర్శకుడు.

# వేటూరి జీవితాన్ని మలుపు త్రిప్పిన 'ఓ సీతకథ'!

'లా' పరీక్షకు వెళ్లబోతూ, నార్ల వెంకటేశ్వర రావు గారి పిలుపుతో 1958లో "ఆంధ్ర ప్రభ"లో సబ్ ఎడిటర్‌గా చేరడం ద్వారా వేటూరి సుందర రామమూర్తి పత్రికా రంగంలో ప్రవేశించారు. అటుపైన "ఆంధ్ర సచిత్ర వార పత్రిక"లో నాలుగు సంవత్సరాలు సబ్ ఎడిటర్‌గా పని చేశారు. అందులో రెండేళ్ల పాటు సినిమా ఎడిటర్‌గానూ ఉన్నారు. తర్వాత విజయవాడలో "ఆంధ్ర ప్రభ" సంపాదక వర్గంలో కొంత కాలం ఉన్నారు. హైదరాబాద్ నుంచి వెలువడే "ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ" దిన పత్రిక, "ఆంధ్ర జనత" సంపాదకుడుగా నాలుగేళ్లు పని చేశారు. 1973లో "సిరికా కొలను చిన్నది" అనే ఈయన రాసిన సంగీత రూపకం ఆకాశవాణిలో ప్రసారం కాగా డైరెక్టర్ కె. విశ్వనాథ్ వినడం జరిగింది. అప్పుడు తాను దర్శకత్వం వహించే "ఓ సీత కథ" చిత్రానికి పాటల రచయితగా వేటూరికి అవకాశం ఇచ్చారు. ఆ చిత్రం వేటూరి జీవితాన్ని ఒక అందమైన మలుపు తిప్పింది.

## "అమ్మో ... పోలీసోళ్ళు"

సెప్టెంబర్ మూడవ వారంలో రిలీజ్ చేయాలను కుంటున్నాం అన్నారు సురేంద్ర నాథ్ రెడ్డి. ఈయన నిర్మించే పై చిత్రంలో శివకృష్ణ, భరణి, బాబూ మోహన్, బాలయ్య, యాదాకృష్ణ, కాంతా రావు, సుబ్బరాయ శర్మ, దేవి, నిలిమ, స్వేచ్ఛ, వరలక్ష్మి, ఉమాశర్మ పాత్రధారులు. దర్శకత్వం టి. కృష్ణ.

## "జాబిలమ్మ పెళ్లి", "ప్రియరాగాలు"

జగపతి బాబు నటించే పై రెండు చిత్రాలకూ ఇటీవల ఊటీలో షూటింగ్ జరిపారు. దర్శకుడు ఎ. కోదండ రామిరెడ్డి. "జాబిలమ్మ పెళ్లి"లో మహేశ్వరి, రుచిత నాయికలు. వాణిశ్రీ, మంజూ భార్గవి, గిరిబాబు, బ్రహ్మానందం, తనికెళ్ల భరణి, జె.వి. సోమయాజులు, అశోక్ కుమార్, చలపతిరావు, గుండు హనుమంత రావు, సరస్వతి పాత్రధారులు. "ప్రియరాగాలు" చిత్రంలో సౌందర్య, మహేశ్వరి నాయికలు. రెండు చిత్రాలకూ కీరవాణి సంగీత దర్శకుడు.

## నమోదు చేయబడిన కొత్త చిత్రాలు

పద్మ కార్పొరేషన్ లిమిటెడ్ "నాంది". సిద్ధార్థ ఫిలిమ్స్ "లవకుశ" సంఘమిత్ర ఫిలిమ్ సర్క్యూట్ "కిరవాణి". లండన్ ఫిలిమ్స్ "బ్రహ్మాస్త్రం". శ్రీ విజయలక్ష్మి ఆర్ట్ ప్రొడక్షన్స్ "శ్రీరస్తు". ఫ్లోరిలైన్ కార్పొరేషన్ "ఫార్టీప్లస్". శ్రీసాయిగణేశ్ ఫిలిమ్స్ "పెద్ద మనిషి". సిద్ధయ్య ఆర్ట్ మూవీస్ "కొండపల్లి దాదా". శ్రీ శిరీషా క్రియేషన్స్ "వసుపు పారాణి". శ్రీ సాయిగణేశ్ ఫిలిమ్స్ "మావూరి సైన్యం". ఎం.ఆర్.ఫిలిమ్స్ "మా అల్లుడు బంగారం". సన్‌రైట్ ప్రొడక్షన్స్ "సీతమ్మ తల్లి". ఎ.ఎ.ఆర్ట్స్ "అమ్మలాంటి అక్కయ్య". శ్రీసాయికృపా ఫిలిమ్స్ "పితృదేవోభవ". కోకిల సినీ క్రియేషన్స్ "తొట్టిగ్యాంగ్". రత్నాఆర్ట్స్ "రాజవంశం". గీతాచిత్రా ఇంటర్నేషనల్ "అమెరికా మొగుడు". రుబైన్ ఆర్ట్స్ "వీర బొబ్బిలి". సన్‌రైజ్ ప్రొడక్షన్స్ "కోడలా కోడలా కొడుకు పెళ్ళామా". మెలోడి మేకర్స్ "ప్రియరాగాలు". వేణుగోపాల్ క్రియేషన్స్ "అడవి మందారం". శ్రీసాయిరామ క్రియేషన్స్ "రంగనాయకమ్మ లాడ్జింగ్ అండ్ బోర్డింగ్". శ్రీ వరలక్ష్మి క్రియేషన్స్ "రంభొచ్చింది రండిరా!". వేణుగోపాల్ క్రియేషన్స్ "నీమొగుడే నామొగుడు". మాతృశ్రీ క్రియేషన్స్ "ప్రియమైన

కొరవ 11 పేజీలో

**ఒక్కపాట లేకపోయినా బోర్‌కొట్టలేదు - నేతల నీతిలేని పనులే కథ అయినా గాడి తప్పలేదు!**

# ఢిల్లీ డైరీ

**చిత్రసమీక్ష**

**అల్లూరు రహీం**

సమకాలీన రాజకీయాలపై స్పందిస్తూ మలయాళ చిత్రసీమ నుంచి అప్పుడప్పుడు చక్కని రాజకీయ చిత్రాలు వస్తుంటాయి. అటువంటి చిత్రమే అమితాబచన్ కార్పొరేషన్ లిమిటెడ్ తెలుగులో అనువదించి సమర్పించి భద్రన్ దర్శకత్వంలో సమర్పించిన ఢిల్లీ డైరీ. ఈ చిత్రంలో మొన్నటి వరకు కేంద్రంలో అధికారంలో వుండిన కాంగ్రెస్ పార్టీ హయాంలో బయట పడిన హవాలా కుంభకోణాలు, జైన్ డైరీలు, జస్టిస్ శర్మ విచారణలను దర్శకుడు కళ్లకు కట్టినట్లు చూపాడు. అధికార మైకంతో అంతం లేకుండా పెరిగి పోతున్న అవినీతి పై యుద్ధం ప్రకటించాలని ఈచిత్రం ఉద్బోధిస్తుంది. లేకుంటే ప్రజాస్వామ్య వ్యవస్థే నాశనమై పోతుందని హెచ్చరిస్తుంది. గాడ్‌మెన్ చంద్రస్వామి సమక్షంలో జరిగిన వివిధ అంతర్జాతీయ ఒప్పందాలు, సిబిఐ చీఫ్ అధికార పార్టీ నేతకు తలవొగ్గి పనిచేయడం వంటి సన్నివేశాలు ఢిల్లీలో జరుగుతున్న నీతిమాలిన పనులకు అద్దం పట్టాయి.

'చట్టాలను చేసేది, జడ్జీలను నియమించేది మనం - మనకు అనుకూలంగా వాళ్లు తీర్పు లివ్వాలని' అధికార పార్టీ నేత మాట్లాడడం ప్రస్తుత, రాజకీయ - న్యాయ వ్యవస్థ మధ్య జరుగుతున్న కోల్డ్‌వార్‌కు అద్దం పడుతుంది. 'పార్టీ కార్యక్రమాలకు నిధులు కావాలంటే ఎక్కడ నుంచి వస్తాయి; అందుకే హవాలా డబ్బులు తీసుకొంటున్నామని, తాము చేసిన తప్పులను రాజకీయ నాయకులు సమర్థించు కోవడాన్ని కూడా దర్శకుడు నేర్పరి తనంతో చూపాడు. జైన్ డైరీలో పేర్లు చూపి భయపెట్టి ప్రతిపక్ష నేతలు తన అవినీతికి వ్యతిరేకంగా వుద్యమం చేయకుండా నీరు గారి పోయేట్లు చేసే సన్నివేశాన్ని చమత్కారంగా చిత్రీకరించారు. న్యాయ వ్యవస్థ ఒక్కటే దేశంలో సజావుగా పనిచేస్తున్నదని చెప్పి, అవినీతి పరులైన రాజకీయ నాయకులకు ప్రజలు బహిరంగంగా శిక్షించాలని సలహా యిస్తాడు దర్శకుడు.

కాని దేశ ప్రజలను గొర్రెలుగా పేర్కొనడం సముచితంగా లేదు. దేశంలోని ప్రముఖ కుంభ కోణాల్ని దర్యాప్తు చేస్తున్న న్యాయమూర్తికి ఒక గన్‌మెన్ రక్షణ కూడా లేకపోవడం వల్ల దుండగుల చేతిలో ఆయన ప్రాణాలు కోల్పోవడం వాస్తవానికి దూరమనిపిస్తుంది. అదే విధంగా హీరో సురేష్ గోపికి మేకప్‌ను పరమ నాసిరకంగా చేయడం బాగోలేదు.

పీపుల్స్ పార్టీ నాయకుడు జ్యోతికృష్ణ అధికారంలో సాగుతూ

కొరవ 11 పేజీలో



స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా విలర్ చిల్డ్రన్ అకాడమీలో సభలో మాట్లాడుతున్న ఎమ్పీ పనబాక లక్ష్మి. ప్రిన్సిపాల్ ఉషా కళ్యాణి.

## జనవాణి

3 పేజీ కొరవ

భూమి యాజమాన్యపు హక్కు పత్రం చాలా అవసరం. నిజమైన ప్రయోజనం ఈ పత్రాల వల్లే కలుగుతుంది.

కావలి వి.వి. నరసింహాచార్యులు

### ఎమ్పీ రైల్వే డివిజన్‌ను సాధించాలి

నెల్లూరు రైల్వే స్టేషన్ అభివృద్ధికి ఎమ్పీ శ్రీమతి పనబాక లక్ష్మి చేస్తున్న కృషి ప్రసంశనీయం. ఆమె రైల్వే సలహా మండలి సభ్యురాలిగా నియమితులు రాలవడం మహదానందం. విజయవాడ రైల్వే డివిజన్‌ను విభజించాలని ప్రభుత్వం ఆలోచనలో వున్నట్లు పత్రికల్లో వార్తలొచ్చాయి. నూతన డివిజన్ స్థాపనకు గుంటూరును సూచించినట్లు తెలుస్తుంది. కాని అత్యంత సమీపంలో రెండు డివిజన్ కేంద్రాలుండటం సముచితం కాదు. నెల్లూరు రైల్వే డివిజన్ స్థాపన సూచిస్తూ మాజీ ఎమ్పీ పద్మశ్రీ ఒక వినతి పత్రాన్ని అప్పటి ప్రధాని పివి నరసింహా రావుకు సమర్పించి వున్నారు. ఇప్పటి ఎమ్పీ లక్ష్మి ఈ ప్రతిపాదనను రైల్వే శాఖలో తనకున్న పలుకుబడితో కదలించి ఫలితాన్ని సాధించాలి. వేదాయపాళెం డివిజన్ రైల్వేకు మంచి స్థలం. ఎమ్పీ ఈ విషయంలో ప్రజలు, ఎమ్మెల్యేలు, రాష్ట్ర ప్రభుత్వం మద్దతు తీసుకోవాలి.

నెల్లూరు ఎ.వి. శేషగిరిరావు

### జిల్లాలో అధికార భాష ఇంగ్లీషా?

నెల్లూరు జిల్లాలో అధికార భాష తెలుగు. కాని టెలిఫోను డిపార్టుమెంటు వారికి మాత్రం అధికార భాష ఇంగ్లీషు. అవతలి ఫోను చెడిపోయిందనో, నెంబరు తప్పుగా చేశారనో, రిపేరులో వుందనో లేకుంటే లైన్లు ఖాళీ లేకుండా వున్నాయనో ఎక్సేంజిలో రికార్డింగ్ చేసిన కంప్యూటర్ సందర్భాన్ని బట్టి వాగుతుంది. ఈ వాగుడు ఇతర చోట్ల ఇంగ్లీషు లోనే కాకుండా, ఆయా స్థానిక భాషల్లో కూడా వుంటుంది. తమిళనాడు అయితే ఈ రికార్డింగ్ వాయిస్ తమిళంలోను, కర్నాటకలో కన్నడంలోను వస్తుంది. కాని నెల్లూరు జిల్లాలో మాత్రం ఇంగ్లీషు లోనే వుంటుంది. నెల్లూరు ప్రజలందరికీ ఇంగ్లీషు వచ్చని అధికారుల అభిప్రాయం కాబోలు? లేకపోతే జనానికి అర్థం కాకపోయినా పరవా లేదను కొంటున్నారో తెలియడం లేదు. కంప్యూటర్లకు తెలుగు నేర్పడం కష్టమైన పనేమీ కాదు కాని అధికారుల

పురానిన వైఖరి దీనికి కారణం.

నెల్లూరు బి.శె. రెడ్డి

### అంబేద్కర్ చిత్రపటాలేవి?

మన భారత రాజ్యాంగ నిర్మాత బాబా సాహెబ్ అంబేద్కర్ చిత్రపటం ఏ పాఠశాలలోనూ దర్శన మీయక పోవడం శోచనీయం. జిల్లాలోని అప్పర్ ప్రైమరీ పాఠశాలల్లో గాంధీ, నెహ్రూ, తిలక్ వంటి దేశ నాయకుల చిత్ర పటాలున్నాయి. మన దేశ నాయకులు అనే హెడ్డింగుతో ఈ ఫోటోలు తగిలించి వుంటారు. కాని వీటిలో కూడా అంబేద్కర్ పేరు అంటరానిదిగా వుండి పోవడం దారుణం. అంబేద్కర్ జయంతులు, వర్ధంతుల పేరుతో ఎన్నో వేల రూపాయలు వెచ్చిస్తున్నా అవి నామమాత్రం గాను, కేవలం దళితులకే పరిమితం కావాలని అన్పించక మానవు. మురికివాడల్లోను, ఊరి చివర ఎన్నో అవమానాలకు గురై సమాజంలో తమ కంటూ ఓ స్థానం లేక అలమటించి పోతున్న తరుణంలో, మేమూ మనుషులమే సంటూ రాజ్యాంగంలో దళితులకో స్థానం కల్పించిన మహనీయుడు అంబేద్కర్. అటువంటి మహోన్నతమైన వ్యక్తి చిత్రపటం స్కూళ్లలో గాని, దేశ నాయకుల లిస్టులో గాని లేకపోవడం శోచనీయం.

ముత్తుకూరు శ్రీరామ శశికళ

### శెట్టిగుంట రోడ్డు సెంటర్‌లో స్పీడ్ బ్రేకులు

నెల్లూరు టౌన్‌లో శెట్టిగుంట రోడ్డు, గోపురం వీధి, రైల్వే గేటు మధ్య జాతీయ రహదారి వుంది. ఈ ప్రాంతంలో రోడ్డు దాటడం నిత్యం ప్రమాద భరితమే. నిమిషానికి అటు ఇటు కనీసం 10 వాహనాలు అమిత వేగంగా పోతుంటాయి. ఈ రోడ్డును పాదచారులు దాటాలంటే గుండెలు అరచేతిలో పెట్టుకోవాలి. ముఖ్యంగా స్త్రీలు, ముసలివాళ్లు, పిల్లలు రోడ్డు దాటడం కష్టంగా వుంటుంది. ఈ ప్రాంతంలో స్పీడ్ బ్రేకర్లను, ట్రాఫిక్ నియంత్రించను ఒక కానిస్టేబుల్‌ను ఏర్పాటు చేయడం ఎంతో అవసరం.

నెల్లూరు ఎ.ఆర్. శాస్త్రి

### నరసింహకొండలో సౌకర్యాలు కల్పించండి

నెల్లూరు టౌన్‌కు సమీపంలో వున్న నరసింహ కొండ పుణ్యక్షేత్రంలో కనీస సౌకర్యాలు లేకపోవడం వల్ల

అక్కడకు వెళ్లిన భక్తులు పడరాని పాట్లు పడుతున్నారు. దేవస్థానంలో అమ్మవారి గుడికి వెళ్లు దారి ఎక్కే లోపల కాళ్లు మాడిపోతాయి. కనీసం పట్టలైనా వేసేందుకు దేవస్థానానికి గతి లేకపోయింది. కొళాయిలు ఉన్నాయి గాని నీళ్లు రావు. కొళాయి ఎప్పుడొస్తుందో, ఎప్పుడు ఉండదో తెలియదు. దేవస్థానం కౌంటర్ పక్కగల బోర్డులో లడ్డు వెల 4 రూపాయలుగా వ్రాసి వున్నా పదిరూపాయలకు అమ్ముతున్నారు. వీటిని గూర్చి పట్టించుకొనే వారే లేరా?

నెల్లూరు ధనుంజయ

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

అవినీతికి మారు పేరుగా నిలుస్తారు గాడ్‌మెన్ రామేంద్ర జీ ఆయన రాజకీయ గురువు. పార్టీలో యువజన విభాగం నాయకుడు సిద్ధార్థ (సురేష్ గోపి) ఈ అవినీతి వ్యతిరేక పోరాటం మొదలెడతారు. యువజన నాయకురాలు అంబికా కృష్ణ (గీత) హత్య కేసుతో సిద్ధార్థను జైలుకు పంపుతారు అధికార పార్టీ నేతలు. జస్టిస్ శర్మ అభ్యర్థన మేరకు సుప్రీం కోర్టు న్యాయమూర్తి (జె.వి. సోమయాజులు) సిద్ధార్థ కేసును మరోసారి దర్యాప్తు చేయమని సిబిఐని కోరుతాడు. సిబిఐ ప్రత్యేకాధి కారి అఖిల (విజయ శాంతి) ఈ విషయమై తీహార్ జైలుకు వెళుతుంది. నాటకీయంగా అఖిల కస్టడీ నుంచి తప్పించుకొన్న సిద్ధార్థ దేశంలో పలు కుంభ కోణాలు, ఉపద్రవాలకు కారకులైన వారిని పథకం ప్రకారం కిడ్నాప్ చేసి వారి తప్పులను వారి చేత ఒప్పించి దేశ వ్యాప్తంగా టివీల్లో ప్రసారం చేయిస్తాడు. చివరన ప్రజా కోర్టులో తగిన శిక్ష విధిస్తాడు.

చిత్రంలో ఒక్క పాట లేకపోయినా, స్క్రీన్‌ప్లే పటిష్టత వల్ల ప్రేక్షకుడు బోర్ ఫీల్ కాడు. జైలులో ఖైదీల పట్ల సిబ్బంది వ్యవహరించే తీరు, గొంతు వరకు భూమిలో దిగబడి ప్రజల నిరసన తెలిపే సన్నివేశాలు చక్కగా వున్నాయి. పార్లమెంటును ధ్వంసం చేసి, దేశంలో విధ్వంసం సృష్టించి తిరిగి అధికారంలో పాగాలన్న అధికార పార్టీపుద్దేశ్యాన్ని వ్యక్తం చేసే సన్నివేశంబల్ల గగుర్పాటు చెందిస్తుంది. నేటి నాయకుల ఆలోచనా తీరును ప్రస్ఫుటీ కరింప జేస్తుంది. మూల మాతృకకు సమానమైన రీతిలో మాటలు రచించేందుకు మాటల రచయిత వసంత్ కుమార్ శ్రమించాడు. ఎడిటర్ సతీష్‌కుమార్ కెమెరా పనితనం చక్కగా కుదిరింది.

సురేష్ గోపి, విజయ శాంతి తమ పాత్రల పోషణలో పోటీపడ్డారు. నటీనటు లందరూ పాత్రల్లో జీవించారు. చాలా రోజుల తరువాత తెరపై కనిపించిన విజయ శాంతి కాసింత వళ్లు చేసి వుంది. సమకాలీన రాజకీయాలపై సమర్థ వంతంగా చిత్రం తీసి విజయ వంతం చేసిన దర్శకుడు భరద్వాజ్ అభినంద నీయుడు.

## ప్రైమరీ షేర్లు

2వ పేజీ కొరవ

ఇవ్వాలు పెట్టినే వున్నాయి. ఇన్వెస్టర్లు నేటి జోలికి పోకుండా వుండడం శ్రేయం. వ్యాంకు వడ్డీరేట్లు, ప్రభుత్వ విధానాలపై ఆధారపడి సెకండరీ మార్కెట్ విధానం, ఎగుమతుల అభివృద్ధి అవకాశం కొత్త పరిశ్రమలను అనుకూలంగా లేవు. అందువల్ల ఇప్పుడు కొత్తగా పరిశ్రమలు పెట్టేవారు వీరిని తట్టుగాని, తమ సంస్థలను లాభాల్లో నడపడం చాలా కష్టం. అందువల్ల కొంత కాలం – కనీసం రెండేళ్ల పాటు – ప్రైమరీ ఇష్యూల జోలికి పోకుండడం ఉత్తమం.

## సినిమా

9 వ పేజీ కొరవ

శ్రీవారు". మాధవ కృష్ణ ఫిలిమ్స్ "సుందర పురుషుడు". పృథ్వీ ఆర్ట్స్ "మౌనప్రేమ". కీర్తిలక్ష్మి ఫిలిమ్స్ "ఏడురాత్రులు". శ్రీఅఖిలాండేశ్వరి ఫిలిమ్స్ "కమాండర్ భగత్‌సింగ్". పద్మసాయి కంబైన్స్ "సాహసవీరులు". ఓం సాయి చిత్ర "పాతాళభూతం". శ్రీవిజయలక్ష్మి ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "మాంగల్యం". లలిత కళాంజలి ప్రొడక్షన్స్ "సీతారాముల పెళ్ళి". వకుల ఆర్ట్స్ "బంగారు వాకిలి". శ్రీలక్ష్మీదుర్గ ఆర్ట్స్ "నాబ్రతుకు భార్యకావాలి". తేజస్విని ప్రొడక్షన్స్ "బంగారు పతకం". శ్రీలక్ష్మీదుర్గా ఆర్ట్స్ "తల్లిభాగ్యం".

## 50ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

కార్యవర్గం 15మందిలో
రెడ్లు -5, కమ్మవారు -4,
బ్రాహ్మలు -3, ఆర్యవైశ్యులు -1,
చేనేత కాంగ్రెసు -1. కుల్లు -14.

**నెల్లూరు పాకీ సమ్మె**

ప్రజాసేవకులు గదా
కమ్యూనిస్టులు - పాకీ సమ్మె
ప్రజారోగ్య భంగకారి కదా. వారేల
వీధులు చిమ్మి - దొడ్లు కడుగరాదు
అని అనవచ్చును గాని.
సోషలిజములో - పనివారి సమ్మెలకు
వ్యతిరేకం చేయరాదన్న సూత్రం యీ
కాంరేడులు చూపుతారేమో? ప్రజా
కాంగ్రెసు వాదులు వీధులు
వూడ్చినారు - పైపైన!- ఇదేయేమి
సేవ చీప్ పాపులారిటీ కోసరం వేసిన
వేషం అనక తప్పదు. ఎందుకంటె
అసలు శుభ్రపరచ వలసినది
పాకీదొడ్లు. వీధుల కంటే ముఖ్యము
ట్రంకురోడ్డులో చిమ్మినంత మాత్రాన
ఒక్క దూషమైనా తెగుతుందా?
విలాస పురుషులు - పిచ్చివాళ్ళు
వచ్చినట్లే యీ ప్రదర్శనాలు
ట్రంకురోడ్డులో బయలు దేరితిరాల.

కమ్యూనిస్టుల సమ్మెకు
అసలు కారణం 1942లో మన
కాంగ్రెసు నాయకులను - పరాయి
ప్రభుత్వ చెరసాలలో ఉంచినపుడు
కమ్యూనిస్టుల విజృంభణ; ఆగష్టు
వీరులను ప్రభుత్వానికి పట్టియ్యటానికి
చేసిన ప్రయత్నాలు - ఆ
చరిత్రాత్మక పవిత్ర ప్రజా పోరాటాన్ని
అక్రమమని. పరాయి వాళ్ల యుద్ధం
ప్రజాయుద్ధమని చేసిన ప్రచారం
అందరికి సువిదితమే.

ఇన్ని ప్రతిష్టను
పోగొట్టుకొన్న కమ్యూనిస్టుల సమ్మెలు

### శతాయుష్వుగా!

చిరునవ్వుల చిలుకరించు
చిద్విలాస మూర్తి నీవే!
మిరుమిట్లలు పరిమళించు
మధురమౌ మనస్వినీవే!
కాంగ్రెసునే జీవితమును
కానుకగా నొసగినావు
ఖద్దరునే ధరియించినతము
గౌరవమును పొందినావు
శాంతిని వేతనమునందు
శాంతి నీలో ప్రజల్విల్ల
రవీంద్రుని సాహిత్యము
రచయితవై తెలిగించినావు
లలిత కళలు నిమ్ము వలచి
విలసిల్లగ లోలోపల
కళామయుల గౌరవించి
కామ్యలెన్నో మొసగినావు
ఆంధ్రదేశ పండితాళి
అలరారుచు మురిసిపోవ
కవిత్రయ అవార్డులతో
గౌరవించి తనిసినావు
బహుభాషా వేత్తనగను
భావ సౌందర్యమ్ము నెరిగి
కవిగా, రవిపోలె భువిన
కావ్యమ్ముల వ్రాసినావు
అనుభవ సారమ్ము నెల్ల
అందించినావు కవితలందు
నవ్యభావ సౌందర్యము
ప్రవింపగ చేసినావు
జన్మదిన మహోత్సవమ్ము
జాతికే సర్వమ్ము కాగ
అక్షరాల సుమాలహాల
అభినందన మందారమాల
అందుకొనుము! రెడ్డివర్య!
ఆనందముగా, శతాయువుగా

-సురభి. నరసింహం

చేయించడానికి తెరగ బడ్డారు. ఆహా మాస్కో పుత్ర వతంసులారా భవత్కుశాగ్ర బుద్ధి వర్ణనాతీతం గదా!

-యస్.వి.రమణయ్య

### నెల్లూరు ముచ్చట్లు

యూనాది హాస్టలు

రాఘవయ్య గారొచ్చి పిల్లకాయలను పిలిపించి మరల 10తేది నుండి ప్రారంభింపజేశారు. కాని ఒకటిన్నర నెల జరిగిన తర్వాత ధనాభావమనే కారణంతో 10మంది పిల్లలను మాత్రం ఇంటికి పొమ్మనడం ఏమంత బాగాలేదు.

***

### పల్లెటూళ్లు

**కురిచేడు**

కురిచేడు హైస్కూలులో కలకలం బయలుదేరి గోలగా వుంది. హెడ్‌మాస్టరు మీద సోషల్ బాయికాట్ చెయ్యాలని ప్రయత్నాలు జరుగు తున్నవి. సర్దుకొని హెడ్మాస్టరు, ఉపాధ్యాయిని అచ్చట నుండి ట్రాన్సుఫరైతే మంచిదేమో! ..

అప్పరాజు

**అల్లూరు**

విజ్ఞాన మందిరి

యాజమాన్యమున 2 తేది ఆగష్టు విప్లవ దినోత్సవం జరిగింది. పేటలో బహిరంగ సభ; నైవి రమణా రెడ్డి గారధ్యక్షత వహించిరి. కృష్ణమా చార్యులు గారి 'క్విట్ ఇండియా' తీర్మానమును గురించి మాట్లాడిరి ..

కమలాకర బాపు

## జిల్లావార్తలు

2 పేజీ తరువాయి

ప్రతిపాదనలు కూడా పరిశీలిస్తున్నట్లు అల్లూరులో ఎమ్మెల్యే కార్యాలయం వ్యవహారాలు చూసే పఠాన్ గఫార్ తెలియజేసారు.

### అల్లూరులో ఆగష్టు15

50 స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు అల్లూరులో ఘనంగా జరిగాయి.

పోస్టాఫీసులో పోస్టుమాస్టర్ పి.ప్రభాకరరావు జాతీయ పతాకాన్ని ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో పోస్టల్ సిబ్బంది, ఐ.డి. పుర్వోగులు పాల్గొన్నారు.

### తృటిలో తప్పిన ప్రమాదం

బ్రేకులు ఫెయిల్ అయి వస్తున్న లారీ బారి నుంచి ఆర్టీసీ బస్సును దాటి వస్తుండగా డ్రైవర్ తప్పించడంతో 40మంది ప్రాణాలతో బతికి బయట పడ్డారు. డ్రైవర్ మసూద్ అహమ్మద్ చాకచక్యంగా ఆ ప్రమాదాన్ని తప్పించాడు. బస్సు రోడ్డు దిగి పొదల్లోకి వెళ్లి పోయింది.

### స్టేట్ ఫస్ట్ ర్యాంకర్ సురేష్‌కు అభినందన!

ఎంసెట్ ఇంజనీరింగ్ పరీక్షల్లో రాష్ట్రంలో మొదటి ర్యాంకు సాధించిన నలగట్ల సురేష్ కుమార్‌రెడ్డి అభినందన సభ 22వతేది అల్లూరు రామకృష్ణా జూనియర్ కాలేజిలో జరిగింది. సభకు కాలేజి పాలక వర్గం అధ్యక్షుడు సీతారామిరెడ్డి అధ్యక్షించారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న పి.భీమన్న మాట్లాడుతూ కష్టపడి సాధించిన సురేష్ చక్కని ఉదాహరణ అన్నారు. చదువు తప్ప మరో ధ్యాస లేని ఫస్ట్ ర్యాంకర్ సురేష్ మున్ముందు ఉన్నత శిఖరాలు అధిరోహించాలని దీవించారు. అల్లంపాటి విజయవర్ధన్ రెడ్డి, మేడా రాఘవరెడ్డి సురేష్ విద్యాభ్యాసం కోసం చెరి 5వేల రూపాయల ప్రోత్సాహక బహుమతి అందించారు. గ్రామంలో వలువురిని ప్రోత్సాహిస్తుండే దోగిపర్తి సత్యనారాయణ సురేష్‌ను పూల కిరీట ధారిని చేసి కవితాగానం చేసారు. ప్రిన్సిపల్ మేడా రమణారెడ్డి, సురేష్ తండ్రి రామచంద్రారెడ్డి, సోదరి ప్రసన్న తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.



స్వాతంత్ర్య దినోత్సవ పేరేడ్‌లో మార్కెటింగ్ మంత్రి టి. రమేష్‌రెడ్డి నుంచి సేవా పతకాలు అందుకొంటున్న డిపిఆర్‌టి కార్యాలయం వుద్యోగి షేక్ రఫీ, డిఆర్‌డిఏ కంప్యూటర్ ఆపరేటర్ మల్లికార్జున శర్మ.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore